# ఈ విష్ణు సహస్రనామ స్తోత్రాన్ని ఎవరు చదవకూడదు ?

ఆర్తా విషణ్ణా శ్శిథిలా శ్చ భీతా ఘోరేషు చ వ్యాధిషు వర్తమానా : ।
సంకీర్త్య నారాయణశబ్దమాత్రం విముక్త దుఃఖా స్సుఖినో భవంతి ॥

పూర్వజన్మలో చేసిన పాపఫలితంగా
ఈ జన్మలో వచ్చిన కష్టం 'ఆర్తి'. దానితో బాధపడే ఆర్తులూ...

ఈ జన్మలో చేసిన పాపఫలితంగా
ఇప్పుడే అనుభవిస్తున్న కష్టం 'విషాదం'. దానితో బాధపడే విషణ్ణులూ...

పూర్వజన్మ ఈ జన్మల పాప ఫలితంగా
కష్టాలననుభవిస్తూ మానసికంగా
క్రుంగిపోవడం 'శిథిలత'. దానితో బాధపడే శిథిలులూ...

తెలిసి తెలిసి తప్పుచేసిందానికి
పరమాత్మ ఏ శిక్షని విధిస్తాడోనని
భయపడడం 'భీతి'. దానితో బాధపడే భీతులూ...

ఏ వైద్యునికీ ఎంతటి ఔషదానికీ
లొంగక శారీరకంగా మానసికంగా
వ్యక్తిని నిరాశా నిస్పృహలకి గురిచేసేది
'ఘోరవ్యాధి'. దానితో బాధపడే ఘోరవ్యాధి పీడితులూ...

దీన్ని పఠించాలని వ్యాసమహర్షి చెప్పాడు,

**మీకు ఇలాటి కష్టాలేమీ లేకుంటే నిస్సందేహంగా**
**ఈ స్తోత్రాన్ని చదవకండి**

*Printed at* **ANU GRAPHICS**, 2/3 BRODIPET, GUNTUR - 2, PH : 353195

అచ్చు తప్పుల్లేని

# శ్రీ విష్ణు సహస్రనామాలు - స్తోత్రము

(ప్రతి నామానికి సులభ వ్యావహారిక భాషలో అర్థంతో)



డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావు

అచ్చు తప్పులేన్ని…

# శ్రీ విష్ణు సహస్రనామాలూ - స్తోత్రమూ

(ప్రతి నామానికీ సులభ వ్యావహారిక భాషలో అర్థంతో)


వ్యాఖ్య :

'రామాయణ ప్రవచన సుధాకర',

'రామాయణ సుధానిధి', 'భాషాప్రవీణ'

**డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావు**

ఎం.ఏ., (తెలుగు) ఎం.ఏ., (సంస్కృతం), పిహెచ్.డి.



ముద్రింపించినవారు :

**డాక్టర్. రామావత్ కళాశౌరి సుందర్‌రామ్ నాయక్ దంపతులు**

(Kalasouri S.R. Naik)

C/o. హరిశౌరి , 1/67/ఎ7, 2వ క్రాస్, 2వ రోడ్,

అనంతపురం - 515 004.

☎ 08554 - 33018.

అచ్చు తప్పుల్లేని

# శ్రీ విష్ణు సహస్రనామాలూ - స్తోత్రమూ

*(ప్రతి నామానికీ సులభ వ్యావహారిక భాషలో అర్థంతో)*

ప్రతులు : రెండు వేలు



వెల : రు. 5/-



: ప్రతులకు :

**డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావు**

5-21-37,
2/6 బ్రాడీపేట, గుంటూరు-2.
పిన్ - 522 002. (ఆంధ్రప్రదేశ్)
☎ 0863 - 354611.

ప్రిన్సిపల్,
సంస్కృత కళాశాల,
తెనాలి, గుంటూరు జిల్లా,
పిన్ : 522 202.

మరియు

**Kalasouri S.R. Naik**
Asst. Professor (Opthalmology)
C/o. Sri Hari Souri,
1/67/A7, 2nd Cross, 2nd Road,
Anantapur - 515 004.
☎ 08554 - 33018



*Type set by :*
ANU GRAPHICS, 2/3, Brodipet, GUNTUR-2. ☎ 353195.

# అంకితం



అహం దూరత స్తే ప దాంభోజయుగ్మప్రణా మేచ్ఛ యాగత్య సేవాం కరోమి ।
సకృత్సేవయా నిత్యసేవాఫలం త్వం పయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో! వేంకటేశ!!

**- కళాశౌరి S.R. నాయక్ దంపతులు.**

# విషయసూచిక

## ముద్రింపిస్తున్న వారిని గూర్చిన నా మాటలు రెండు

శ్రీ R.S.R. నాయక్ - శ్రీయుతులు రామావత్ హజాబాయి ెలూనాయక్ దంపతులకి మూడవ సంతానంగా 9.5.64 న తెనాలిలో ట్టారు.

ఈ గ్రంథకర్త పిన్నత్త గారి పిల్లలు 'వేంకటరమణ, మల్లిబాబు' తాలూకా జూనియర్ కళాశాలలో తనకి మిత్రులు కావడం వల్ల శ్రీ యక్ తఱుచు గ్రంథకర్త పిన్నత్తగారి ఇంటికి వస్తూండేవారు. అప్పుడే ంథకర్త భార్య శ్రీమతి సుబ్బలక్ష్మి, వారి పిల్లలు సుధాంశూ మాంశూలతో కూడ బాగా సాన్నిహిత్య మేర్పడింది వీరికి.

తమ తలిదండ్రులిచ్చిన బుద్ధివిశేషం కారణంగా శ్రీ నాయక్ ంటూరు మెడికల్ కాలేజిలోనే ఎంబీబీయెస్ పూర్తిచేసారు. అప్పుడు డా తఱుచు గ్రంథకర్త యింటికి వస్తూ పోతూండేవారు.

1988 లో విశాఖ ఆంధ్రా మెడికల్ కాలేజిలో M.S., ప్తాల్మాలజీ - కంటి విభాగం) లో చేరి 91 నాటికి చదువు పూర్తిచేసి శ్రీహరికృపావిశేషం కారణంగా అదే కళాశాలలో 'అసిస్టెంట్ ప్రొఫెసర్' చేరారు. వారి యిలవేల్పు శ్రీ వేంకటేశ్వరస్వామి - వీరికి 'అర్ధాంగి'ని డ శ్రీహరిభక్తి కల కుటుంబం (వారు కట్టుకున్న యింటికి ట్టుకున్నపేరు శౌరికృప) నించే ఇప్పిస్తూ 21-1-91న వివాహాన్ని కునేలా చేసాడు. అందుకే ఉభయ కుటుంబాల పట్లా ఆయన

అనుగ్రహానికి గుర్తుగా తిరుమలలోనే వివాహాన్ని చేసుకున్నారు వీరు. 8-12-94న మొదటిసంతానంగా "శ్రీకీర్తి"ఈ దంపతులని అమ్మానాన్నలని చేస్తూ - అలా పిలుచుకోగల అదృష్టాన్నిస్తూ - జన్మిస్తే ఈ పాపని 'అక్కా' అని పిలుచుకునే అవకాశాన్ని కల్గించుకుంటూ రెండో సంతానంగా "శ్రీశ్వేత" 21-6-96న జన్మించింది.

**వీరి కుటుంబం ఇదిగో....**



**శ్రీకీర్తి - S.R. నాయక్ - శ్రీ శ్వేత - కళాశౌరి**

ఇక వీరి కుటుంబ సభ్యులంతా యోగోదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా - రాంచీ స్వామి శ్రీశ్రీశ్రీ పరమహంస యోగానందులవారి శిష్యులే.



**శ్రీ పరమహంస యోగానంద (5-1-18937-3-1952) రాంచీ (బీహార్)**

ఇక వైద్య విద్యాప్రతిభ విషయానికొస్తే 1997లో భారతప్రభుత్వపు సైన్స్ అండ్ టెక్నాలజి వారి ఆధ్వర్యంలో 'ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆఫ్ కాంటాక్ట్‌లెన్స్ ఎడ్యుకేటర్స్ రీజినల్ కో-ఆర్డినేటర్'గా (IACLE) ఆస్ట్రేలియా లోని University of New South Vales, Sidney కి నెలరోజులపాటు కంటి వైద్యంలో ఆధునికపద్ధతులని అధ్యయనం చేయడానికి వెళ్లారు శ్రీ నాయక్.

ప్రపంచ ప్రఖ్యాతి పొందిన CCLRU (Cornea and Contact Lens Research Unit) లో 'కంటిలో జీవించి ఉన్న సిస్ట్' గురించి శ్రీ నాయక్ ప్రసంగం చేయడం, దాన్ని అంతా ఆమోదించి హర్షించడమనేది సంతోషానికే సంతోషపడదగిన అంశం.

శ్రీనాయక్ భార్య చి॥సౌ॥ కళాశౌరి - శ్రీయుతులు లక్ష్మిహరిశౌరి దంపతులకి అనంతపూర్‌లో 29.7.70 న జన్మించారు. 1994లో ఎంబీబియస్ పూర్తిచేసి విశాఖజిల్లా 'తగరపువలస'లో సొంత నర్సింగ్‌హోం ను నడిపారు. ఈమె తండ్రి కడపలో 'ఇన్‌కంటాక్స్ ఆఫీసర్'గా పనిచేస్తున్నారు.

తాము ప్రత్యక్షంగా అనుభవించి ఫలితాన్ని పొంది ఆనందపడుతూన్న ' శ్రీ విష్ణుసహస్రనామస్తోత్ర పారాయణ శక్తి'ని ఇలాగే పదిమందికీ ఎల్లకాలమూ తెలియజేసే ఇలాటి మంచిపనులని ఎప్పుడూ చేయాలని ఎదురుచూస్తూ, ఆ శక్తిని శ్రీహరి వారికనుగ్రహించాలని శ్రీమన్నారాయణుణ్ణి వేడుకుంటూ.... సెలవు.

- మైలవరపు శ్రీనివాసరావు.

# రామావత్ వారి వంశవృక్షం

హేమానాయక్

**లాలూనాయక్**
**హంజాబాయి**

↓

డా॥ అమర్ సింగ్ నాయక్ M.D.,
(...)లక్ష్మి M.A.,

డా॥ కృష్ణ
(...)విత
(M).D., (Gyn)

(కృ)ష్ణవీణ B.E., ←
(కృ)ష్ణవంశి B.E., ←

రామచంద్రనాయక్ B.Tech., M.B.A.
లక్ష్మి B.A.,

హిమబిందు M.B.B.S.,
రాగవంశి B.Tech.,

ఉమాబాయి M.B.A.
భావ్‌సింగ్ M.B.A.,

నివేదిత
వివేక్



**డా॥ సుందరరామ్ నాయక్** M.S., (Ophth)
(R.S.R. NAIK)

**హరిశౌరి**
**లక్ష్మిశౌరి**
→ **కళాశౌరి** M.B.B.S.,

**శ్రీకీర్తి** **శ్రీశ్వేత**

# ఈ పుస్తక ప్రచురణ సంకల్పం ఎలా కలిగింది?

ఆ మధ్య నేను 1988లో హైదరాబాద్ వెళ్లినప్పుడు ISKCON Temple లో, ఈ గ్రంథకర్త డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావుగారు రాసిన 'శ్రీ విష్ణుసహస్రనామము - అంతరార్థ రూపము' అనే పుస్తకాన్ని చూడ్డం జరిగింది. వెయ్యినామాలకీ విశేషమైన అర్థాలని వ్యాఖ్యతో ఇయ్యడమే కాక లోతుగా రాయబడిన సుదీర్ఘపీఠిక నన్నానందింపచేసింది.

నాకు చిన్నప్పటినించీ పరిచయమున్నవారే ఈ గ్రంథకర్త కావడ మానందమన్పించింది కూడ.

శ్రీ విష్ణు సహస్రనామాలని రోజుకి ముమ్మారు క్రమం తప్పక పఠిస్తూ ఆ నామాల పారాయణ ఫలితాన్ని ప్రత్యక్షంగా పొందిన నేనూ, నాభార్యా శ్రీ విష్ణు సహస్రనామాలకి ఉన్న అర్థాన్ని వీరిచేతనే "స్థూలంగా " (ఒక్కో నామానికీ ఒకేఒక్క వాక్యంలో అర్థం) రాయించాలని భావించాం. ఇలా రాయిస్తే ఈ పుస్తకం జేబులో పట్టేందుకు వీలుగా ఉండి, పాఠకులకి మరింత సౌకర్యంగా ఉంటుందనిపించింది. అంతేకాదు. సహస్రనామస్తోత్రమూ, పూజ కూడ చేసుకోదలిస్తే నామాలూ, ఒకేచోట ఉండి అదికూడా జేబులో పట్టేలా ఉండి చాల బాగుంటుందని మరోమారు భావించి వారి అంగీకారాన్ని అడిగాం. అంతే!

ఆయన అంగీకార ఫలితమే ఇదుగో మీ ముందున్న ఈ పుస్తకం.

స్వస్తి.

- కళాశౌరి నాయక్ దంపతులు.

# వ్యాఖ్యాకర్తని గూర్చిన సంక్షిప్త పరిచయం

పేరు : డాక్టర్. మైలవరపు శ్రీనివాసరావు

విద్యార్హతలు : భాషాప్రవీణ, ఎం.ఏ., (తెలుగు)
ఎం.ఏ., (సంస్కృతము) పిహెచ్.డి.,

రచనలు : **గ్రంథరూపంలో**
ముద్రింపబడినవి : 13 ముద్రణలో : 05
**వ్యాసాల రూపంలో**
స్వాతి. వారపత్రికలో, ఆంధ్రప్రభ వారపత్రికలోనూ, భవిష్యవాణి (జ్యోతిష) - విశ్వధర్మవాణి - సప్తగిరి - గౌరాంగ - శ్రీరామకృష్ణప్రభ - అర్క ..... మొదలైన పది పత్రికలలో....

బిరుదులు : రామాయణ ప్రవచన సుధాకర, రామాయణ సుధానిధి.

ఉద్యోగం : తెనాలి సంస్కృత కళాశాల ప్రిన్సిపల్

ఇతరాలు : 1. నాగార్జున విశ్వవిద్యాలయ పరిధిలోని ఓరియంటల్ కళాశాలల డీన్
2. బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్
3. దూరదర్శన్ ద్వారా తిరుమల తిరుపతి బ్రహ్మోత్సవాల ప్రత్యక్ష వ్యాఖ్యాత.

4. ఆకాశవాణి ద్వారా భద్రాచల రామ కల్యాణ వ్యాఖ్యాత

5. ఆకాశవాణి విజయవాడ ద్వారా గడిచిన 21 ఏళ్లుగా సంస్కృత పాఠాల ఉపాధ్యాయుడు (సంస్కృత పరిచయ కార్యక్రమ నిర్వాహకుడు)

6. ఇటీవల ప్రమాది ఉగాది నాడు (18-3-99) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఆహ్వానంపై, ఆంధ్రప్రదేశ్ భవన్ - న్యూఢిల్లీలో 'పంచాంగ శ్రవణం'

7. శ్రీమద్రామాయణం పైనా ఇతర పురాణేతిహాసాల పైనా రెండువేల ప్రసంగాలు

8. దేశంలోని వివిధ విశ్వవిద్యాలయాల నించీ వచ్చిన కళాశాలా ఉపన్యాసకులకి తిరుపతి కేంద్రీయ విశ్వవిద్యాలయంలో సంవత్సరానికోమారు ఆంగ్ల/ సంస్కృతాలలో సాహిత్య - శాస్త్ర విషయాలపై కొన్ని ఉపన్యాసాలు (Resource person to the re-fresher course students) మొదలైనవి.

జీవితవాంఛ : నేటికాలంలో వచ్చే చౌకబారు - కాలక్షేపపు కథల, నవలల స్థానాల్లో ఇహ-పర సుఖాన్నందీయగల శ్రీమద్రామాయణ భారత భాగవత గ్రంథాలని చూడాలని.

# శ్రీ విష్ణు సహస్రనామము

## (ప్రతి నామానికీ అర్థంతో)

1. విశ్వమ్ - ప్రపంచమే తానుగా అయినవాడు.
2. విష్ణుః - ప్రపంచంలోని అన్నిటా వ్యాపించి ఉన్నవాడు.
3. వషట్కారః - యజ్ఞంలోని ద్రవ్యాలని స్వీకరించేవాడు.
4. భూతభవ్యభవత్ప్రభుః - భూత-భవిష్యత్-వర్తమానాలు మూటికీ అధికారియైనవాడు.
5. భూతకృద్ - స్థావరాలనీ(ప్రాణం లేనివి) జంగమాలనీ (ప్రాణం ఉండితిరిగేవి) సృష్టించేవాడు.
6. భూతభృత్ - తాను సృష్టించినవాటిలోఉన్న మంచి చెడు భేదాన్ని చూడక అన్నిటినీ/ అందటినీ భరించేవాడు.
7. భావః - ప్రపంచమే తన చిరునామాగా కలవాడు.
8. భూతాత్మా - సమస్త ప్రాణులకీ ఆత్మరూపంగా ఉన్నవాడు.

9. **భూతభావనః** - అన్నిటినీ అభివృద్ధి చేస్తూండేవాడు.

10. **పూతాత్మా** - పవిత్రమైన ఆత్మ కలవాడు.

11. **పరమాత్మా** - అందరికీ ఉన్న ఆత్మల కన్నింటికీ ఆత్మ అయినవాడు.

12. **ముక్తానాం పరమాగతిః** - మోక్షాన్ని పొందడానికి ఎవరిని చేరాల్సి ఉందో అతడు.

13. **అవ్యయః** - మార్పుగానీ నాశనంగానీ లేనివాడు.

14. **పురుషః** - ప్రతి పురంలోనూ (శరీరం)నివసించేవాడు.

15. **సాక్షీ** - ప్రతి జీవీ చేసేదాన్ని తన కన్నులతో చూసేవాడు.

16. **క్షేత్రజ్ఞః** - ఈ క్షేత్రాల(శరీరాల) తత్త్వాన్ని బాగా తెలిసినవాడు.

17. **అక్షరః(అక్ష+రః)** - వైకుంఠాన్ని కూడా తెచ్చి ఇయ్యగలిగినవాడు.

18. **యోగః** - యోగవిద్య ద్వారా కనుక్కోగలిగినవాడు.

19. **యోగవిదాం నేతా** - యోగవేత్తలని రక్షించేవాడు.

20. **ప్రధాన పురుషేశ్వరః** - వ్యక్తికీ - ఆ వ్యక్తిలో ఉండే మాయకీ కూడా ప్రభువైనవాడు.

21. **నారసింహవపుః** - నరరూపాన్నీ సింహరూపాన్నీ కలిపి ధరించినవాడు.

22. **శ్రీమాన్** - లక్ష్మీదేవిని నిరంతరం తన వద్ద కలిగి ఉండేవాడు.

23. **కేశవః** - ఆకర్షణీయమైన శిరోజాలు కలవాడు.

24. **పురుషోత్తమః** - పురుషులలో ఉత్తముడు.

25. **సర్వః** - అన్నిటికీ ఉండే ఎన్నో లక్షణాలన్నీ తానే అయినవాడు.

26. **శర్వః** - కాలం మూడగానే సంహరించేవాడు.

27. **శివః** - శివుని రూపమే తానైనవాడు.

28. **స్థాణుః** - అవతారాలన్నింటిలోనూ ఒకే లక్షణాలతో స్థిరంగా ఉండేవాడు.

29. **భూతాదిః** - భూతాలన్నిటి పుట్టుకకీ మూలకారణమైనవాడు.

30. **నిధిః అవ్యయః** - ఎప్పటికీ తఱిగిపోని నిధి అయినవాడు.

31. సంభవః - ధర్మసంస్థాపన కోసమే పుట్టేవాడు.

32. భావనః - అందరు జీవులకీ తమ తమ కర్మఫలాను గుణంగా ఫలాన్ని ఇచ్చేవాడు.

33. భర్తా - సుఖదుఃఖాలు రెంటినీ సమంగా భరించేవాడు.

34. ప్ర+భవః - దివ్యమైన విలక్షణమైన జన్మ కలవాడు.

35. ప్రభుః - చేసే పనులన్నింటిలోనూ నేర్పరితనం కలవాడు.

36. ఈశ్వరః - కారణం మనకి తెలియని రీతిలో అధికారిగా ఉండేవాడు.

37. స్వయంభూః - స్వయంగా పుట్టగలిగినవాడు.

38. శంభుః - సుఖాన్నీ శుభాన్నీ తక్షణం కలగచేసేవాడు.

39. ఆదిత్యః - సూర్యులు పన్నెండుగురికీ ఆధారభూత మైనవాడు.

40. పుష్కరాక్షః - పద్మాల వంటి కళ్లు కలవాడు.

41. మహాస్వనః - వేదమే తన నాదంగా కలవాడు.

42. **అనాదినిధనః** - ఆది - అంతాల్లేనివాడు.

43. **ధాతా** - ప్రపంచాన్ని తానై ధరించేవాడు.

44. **విధాతా** - వ్యక్తులు చేసే కర్మలకీ ఫలితాలకీ కర్త అయినవాడు.

45. **ధాతురుత్తమః** - బ్రహ్మని కూడా మించిన సృష్టికర్త.

46. **అప్రమేయః** - ఏ ప్రమాణానికీ లొంగనివాడు.

47. **హృషీకేశః** - జ్ఞాన - కర్మేంద్రియాలన్నింటికీ అధికారి.

48. **పద్మనాభః** - ప్రపంచసృష్టికి ఆధారభూతమైన పద్మాన్ని బొడ్డులో కలిగినవాడు.

49. **అమరప్రభుః** - చావుని ఎరగని దేవతలకి ప్రభువు.

50. **విశ్వకర్మా** - ప్రపంచసృష్టి మాత్రమే తన పనైనవాడు.

51. **మనుః** - ప్రతివిషయాన్నీ లోతుగా మననం చేయగలిగినవాడు

52. **త్వష్టా** - ప్రలయానికి ముందు జీవులని నశింప చేసేవాడు.

53. **స్థవిష్ఠః** - మిక్కిలి స్థూలంగా దర్శనమిచ్చేవాడు.

54. స్థవిరోధ్రువః - ఎంతోకాలం నించీ ఉన్నవాడూ - కదలనివాడూను.

55. అగ్రాహ్యః - జ్ఞాన కర్మేంద్రియాల ద్వారా పట్టుకో వీలుకానివాడు.

56. శాశ్వతః - ఎల్లప్పుడూ ఉండగలిగేవాడు.

57. కృష్ణః - ఆకర్షణీయమైన రూపం కలిగి అందరినీ ఆకర్షించేవాడు.

58. లోహితాక్షః - ఎఱ్ఱని నేత్రాలు కలవాడు.

59. ప్రతర్దనః - ప్రలయకాలంలో ప్రాణుల కర్మఫలాన్ని బట్టి హింసించేవాడు.

). ప్రభూతః - ఉత్తమ గుణాలు కలవాడు.

l. త్రికకుబ్ధామ - ముల్లోకాలూ తన నివాసంగా కలవాడు.

పవిత్రమ్ - పవిత్రుడై పవిత్రతని కల్గించేవాడు.

3. మంగలం పరమ్ - విశేషంగా శుభాన్ని కల్గించేవాడు.

4. ఈశానః - తన ఆలోచనలకి అనుగుణంగా సమస్త భూతాలనీ శాసించేవాడు.

65. ప్రాణదః - ప్రాణాన్ని ఇచ్చేవాడూ త్రుంచేవాడూను.

66. ప్రాణః - ప్రాణులకి పుట్టుకతో వచ్చే ఉచ్ఛ్వాస మైనవాడు.

67. జ్యేష్ఠః - అందరికీ పెద్ద.

68. శ్రేష్ఠః - అందరి ప్రశంసలకీ పాత్రుడు.

69. ప్రజాపతిః - ప్రజలని రక్షించేవాడు.

70. హిరణ్యగర్భః - బ్రహ్మదేవుని క్కూడా ఆత్మ.

71. భూగర్భః - భూమినంతటినీ తన గర్భంలో ఉంచుకొనేవాడు.

72. మాధవః - లక్ష్మీభర్త.

73. మధుసూదనః - మధువనే పేరున్న రాక్షసుణ్ణి సంహరించిన వాడు.

74. ఈశ్వరః (ఈ+ఈశ+వరః) - బ్రహ్మ, ఈశ్వరుల కంటె శ్రేష్ఠుడు.

75. విక్రమీ - ప్రతి కార్యంలోనూ తనదైన విశేషమైన విచిత్రమైన ఒక క్రమం కలవాడు.

76. ధన్వీ - విల్లు పట్టినవాడు.

77. మేధావీ - మఱుపు లేనివాడు.

78. విక్రమః - గరుత్మంతుని ద్వారా ప్రయాణించేవాడు.

79. క్రమః - లోక క్షేమాన్నే దృష్టిలో ఉంచుకుని అడుగు వేసేవాడు.

80. **అనుత్తమః** - ఎవనికంటె ఇక ఉత్తముడు లేడో అతడు.

81. **దురాధర్షః** - ఎవరికీ ఎప్పుడూ లొంగనివాడు.

82. **కృతజ్ఞః** - ఏ ప్రాణి ఏమాత్రపు ఆరాధనాన్ని చేసినా ఎప్పుడూ గుర్తుంచుకొనేవాడు.

83. **కృతిః** - ప్రతి ప్రయత్నానికీ కారణమైనవాడు.

84. **ఆత్మవాన్** - ఎవరిమీదా ఆధారపడనివాడు.

85. **సురేశః** - దేవతలకి కూడ అధికారి.

86. **శరణమ్** - ఆర్తిని పోగొట్టగలవాడు.

87. **శర్మ** - సుఖాన్నిచ్చే రూపం కలవాడు.

88. **విశ్వరేతాః** - విశ్వమనే చెట్టుకి విత్తనం లాటివాడు.

89. **ప్రజాభవః** - ప్రజల పుట్టుకకి కారణమైనవాడు.

90. **అహః** - ప్రకాశమంతా తన రూపంగా కలవాడు.

91. సంవత్సరః - కాలమే తానైనవాడు.

92. వ్యాలః - పాములాగా ఎప్పుడోగాని కనబడకుండా తన ఉనికిని ఎప్పుడూ చెప్తూండేవాడు.

93. ప్రత్యయః - ప్రజ్ఞని తన రూపంగా కలిగినవాడు.

94. సర్వదర్శనః - అందరికళ్లూ తనవిగా కల్గినవాడు.

95. అజః - ఎవరికీ పుట్టనివాడు. (ఋణం లేనివాడు)

96. సర్వేశ్వరః - ఈశ్వరులందరికీ ఈశ్వరుడు.

97. సిద్ధః - భక్తుల్ని రక్షించడానికి సిద్ధంగా ఉండేవాడు.

98. సిద్ధిః - జ్ఞానరూపంతో ప్రకాశించేవాడు.

99. సర్వాదిః - భూతాలన్నింటికీ మూలకారణమైనవాడు.

100. అచ్యుతః - తన స్థానం నించి జారిపోనితనం కలవాడు.

101. వృషాకపిః - వరాహావతారం ద్వారా భూమిని ఎత్తి లోక ధర్మాన్ని రక్షించినవాడు.

102. అమేయాత్మా - 'ఇది' అని నిర్ణయింప వీల్లేని రూపం కలవాడు.

103. సర్వయోగవినిస్సృతః - సర్వయోగ శాస్త్రాల ద్వారా తనని గూర్చి (వస్తువసుడి) తెలియజేసేవాడు.

104. వసుః - సర్వభూతాల్లోనూ తానై ఉండేవాడు.

105. వసుమనాః - కాలుష్యభావం లేని మనసు కలవాడు.

106. సత్యః - సత్యమే తన రూపంగా కలవాడు.

107. సమాత్మా - పెద్ద చిన్న భేదం లేక అందరిలోనూ ఒకే తీరుగా ఉండేవాడు.

108. సమ్మితః - అందరివాడుగా కన్పించేవాడు.

109. సమః - ఎప్పుడూ లక్ష్మితోనే ఉండేవాడు.

110. అమోఘః - వ్యర్థమైన ఏ పనినీ చేయనివాడు.

111. పుండరీకాక్షః - పద్మాల వంటి కళ్ళు కలవాడు.

112. వృషకర్మా - ధర్మానికి లోబడే విధంగానే ప్రవర్తించేవాడు.

113. వృషాకృతిః - ధర్మమే తన రూపంగా కలిగినవాడు.

114. రుద్రః - దుఃఖాన్ని తొలగించగలవాడు.

115. బహుశిరాః - అనేక శిరస్సులు (ఆలోచనలు) కలవాడు.

116. బభ్రుః - భరించేవాడు.

117. విశ్వయోనిః - ప్రపంచమనే ఫలితానికి కారణమైనవాడు.

118. శుచిశ్రవాః - తన పేరిట స్తోత్రం చేసేందుకు వీలుగా తగిన పేర్లున్నవాడు.

119. అమృతః - మరణవిధానమే లేనివాడు.

120. శాశ్వతః స్థాణుః - శాశ్వతుడై స్థిరంగా ఉండేవాడు.

121. వరారోహః - సర్వోత్తమైన గమ్యస్థానమైనవాడు.

122. మహాతపాః - చెప్పలేనంత తపస్సుని చేసినవాడు.

123. సర్వగః - అందరి క్షేమాన్ని గూర్చి వెళ్లేవాడు (ఆ యా లోకాలకి)

124. సర్వవిద్భానుః - అన్నీ తెలిసినవాడూ, సూర్యునిలా ఉండేవాడూను.

125. విష్వక్సేనః - సేనలన్నిటికీ భయాన్ని కల్గించేవాడు.

126. జనార్దనః - మోక్షం కోసం ప్రార్థించబడేవాడు.

127. వేదః - వేదాలే తన రూపంగా కలవాడు.

128. వేదవిత్ - వేదాన్ని స్పష్టంగా అర్థం చేసుకున్నవాడు.

129. అవ్యంగః - తన జ్ఞాన స్వరూపానికి లోపమే లేనివాడు.

130. వేదాంగః - వేదాలే తనకి అవయవాలుగా కలవాడు.

131. వేదవిత్ - వేదార్థాన్ని మిక్కిలిగా విచారించేవాడు.

132. కవిః - తన ఊహకి అనుగుణంగా రచన చేసేవాడు.

133. లోకాధ్యక్షః - పధ్నాలుగు లోకాల క్షేమాన్నీ పరిశీలించే వాడు.

134. సురాధ్యక్షః - దేవతల బాగోగులని పరిశీలించేవాడు.

135. ధర్మాధ్యక్షః - యుగధర్మాన్ని బట్టి పరిపాలన సాగేలా చేసేవాడు.

.36. కృతాకృతః - కార్యకారణాలు తానే అయి కార్యరూపంగా కనిపించేవారు.

37. చతురాత్మా - సృష్టి, స్థితి, కాలం, ప్రలయం అనే నాల్గు రూపాలతో ఉండేవాడు.

38. చతుర్వ్యూహః - నాలుగు విధాలైన ఉపాయాలూ కలవాడు.

9. చతుర్దంష్ట్రః - వరాహావతారంలో నాలుగు కోరలు కలవాడు.

0. చతుర్భుజః - 'ధర్మ అర్థ కామ మోక్షా'లనే నాల్గు చేతులు కలవాడు.

141. భ్రాజిష్ణుః - చెప్పలేనంత ప్రకాశంతో ఉండేవాడు.

142. భోజనమ్ - మాయాస్వరూపమయినవాడు.

143. భోక్తా - ప్రీతితో ఇచ్చిన దానిని సంతోషంగా భుజించేవాడు.

144. సహిష్ణుః - భక్తుల అపరాధాలని సహించేవాడు.

145. జగదాదిజరి - ప్రలయమయ్యాక మొదటగా పుట్టేవాడు.

146. అనఘః - పాపం వచ్చే పనుల్ని చేసికూడా పాపం లేనివాడు.

147. విజయః - తన గుణాలతో సమస్తాన్నీ జయించేవాడు.

148. జేతా - జయించే స్వభావం ఉన్నవాడు.

149. విశ్వయోనిః - ప్రపంచానికి ముఖ్యమైన కాలంలోని మార్పు లన్నిటికీ కారణమైనవాడు.

150. పునర్వసుః - జీవుని రూపంలో మరల మరల శరీరాల్లో నివసించేవాడు.

151. ఉపేంద్రః - ఇంద్రునికి కూడా మించినవాడు.

152. వామనః - వ్యక్తిని చిన్నబటిచేదైన యాచనమనే పనిని లోకసుఖం కోసం చేసేవాడు.

153. ప్రాంశు: - పెరుగుతూండే స్వభావం కలవాడు.

154. అమోఘః - వ్యర్థం కాని పనిచేసేవారు.

155. శుచిః - స్మరించినవారిని, పూజించినవారిని, పవిత్రులినిగా చేసేవాడు.

156. ఊర్జితః - చెప్పలేనంత బలం కలవాడు.

157. అతీంద్రః - జ్ఞాన - ఐశ్వర్యాల్లో ఇంద్రుణ్ణి మించినవాడు.

158. సంగ్రహః - ప్రలయకాలంలో సమస్తాన్నీ ఒకచోటికి చేర్చేవాడు.

159. సర్గః - సృష్టికీ, సృష్టికారణానికీ కారణమైనవాడు.

160. ధృతాత్మా - అందరి ఆత్మలూ, తనలో లగ్నం చేయబడినవాడు.

161. నియమః - ప్రజలను తమ తమ అధికారాలలో నియమించేవాడు.

162. యమః - అందటినీ తన ఆలోచన ప్రకారమే నడిపించేవాడు.

163. వేద్యః - మోక్షాన్ని కోరేవారికి తెలుసుకోదగినవాడు.

164. వైద్యః - అన్ని విద్యలూ తెలిసినవాడు.

165. సదా యోగీ - ఎప్పుడూ యోగాభ్యాసంలోనే ఉండేవాడు.

166. వీరహా - ధర్మరక్షణ కోసం రాక్షసులని చంపినవాడు.

167. మాధవః - తన అధీనంలో బ్రహ్మవిద్య కలవాడు.

168. మధుః - భక్తులకు తేనెలాగా ఇష్టాన్ని కల్గించేవాడు.

169. అతీంద్రియః - జ్ఞాన-కర్మ ఇంద్రియాలకి అందనివాడు.

170. మహామాయః - మోసం చేయదలచిన అందరి మోసాలకీ మించిన మోసగాడు.

171. మహోత్సాహః - సృష్టిచేయడానికి ఉత్సాహాన్ని చూపించేవాడు.

172. మహాబలః - ఎంతో బలం కలిగినవాళ్లందరి బలం కంటె బలవంతుడు.

173. మహాబుద్ధిః - బుద్ధిమంతులందరి బుద్ధికీ మించిన బుద్ధిమంతుడు.

174. మహావీర్యః - గొప్ప పరాక్రమం కలవాడు.

175. మహాశక్తిః - అందరి శక్తికీ మించిన శక్తి కలవాడు.

176. మహాద్యుతిః - లోపలా బయటా కూడా ప్రకాశించే నేర్పున్నవాడు.

177. అనిర్దేశ్యవపుః - 'ఇలా ఉంటా'డని చెప్ప వీల్లేని శరీరం కలవాడు.

178. శ్రీమాన్ - ఆర్తుల దీనాలాపాలని విన్పించే లక్ష్మితో కూడినవాడు.

179. **అమేయాత్మా** - ఎవరి ఊహకీ అందని బుద్ధినైపుణ్యమున్న వాడు.

180. **మహాద్రిధృత్** - మందర - గోవర్ధన..... పర్వతాలని ఎత్తగల్గినవాడు.

181. **మహేష్వాసః** - గొప్ప విల్లుని ఎక్కుపెట్టగలవాడు.

182. **మహీభర్తా** - ప్రలయంలో నీటితో మునిగిన భూమిని కూడా ఎత్తగల్గినవాడు.

183. **శ్రీనివాసః** - లక్ష్మిదేవికి కూడా రక్షణ నీయగల్గినవాడు.

184. **సతాం గతిః** - నమ్మిన సత్పురుషులకి దిక్కైనవాడు.

185. **అనిరుద్ధః** - ఏ అవతారంలోనూ అడ్డుని ఎరగనివాడు.

186. **సురానందః** - దేవతలంతటి వారిక్కూడా ఆనందాన్నిచ్చే వాడు.

187. **గోవిందః** - భూమిని మనం పొందేలా చేయగల్గినవాడు.

188. **గోవిదాంపతిః** - వాక్శక్తిని తెలిసిన వారిక్కూడా దిక్కు.

189. **మరీచిః** - ప్రకాశానిక్కూడ ప్రకాశాన్ని అందించేవాడు.

190. **దమనః** - ప్రాణుల్ని సరిదిద్దడం కోసం శాపించేవాడు

191. **హంస:** - శరీరంలో చైతన్యాన్ని కల్గించేవాడు.

192. **సుపర్ణ:** - సుందరమైన ఱెక్కలు కలవాడు. (అనేక విధాలుగా ఎగరగలిగినవాడు)

193. **భుజగోత్తమ:** - పాముజాతిలో శ్రేష్ఠుడు.

194. **హిరణ్యగర్భ:** - శుభాన్ని కల్గించే బొడ్డు(సంతతి)న్నవాడు.

195. **సుతపా:** - ఏకాగ్రతతో సరైన తపస్సు చేసేవాడు.

196. **పద్మనాభ:** - హృదయపద్మం మధ్యనుండే బొడ్డులో కన్పించేవాడు.

197. **ప్రజాపతి:** - పుడుతూండే లక్షణమున్న 'ప్ర-జ'లకి ప్రభువు.

198. **అమృత్యు:** - 'మరణం - తద్వారా దుఃఖం' మొదలైనవి లేనే లేనివాడు.

199. సర్వదృక్ - అందరూ చేసే అన్ని పనులనీ చూడగలిగినవాడు.

200. **సింహ:** - అధర్మపరులని హింసించేవాడు.

201. **సంధాతా** - పుణ్య - పాపాలకి సరైన ఫలితాన్ని సమకూరుస్తుండేవాడు.

202. **సంధిమాన్** - జీవుడుగా మారి ప్రతివ్యక్తీ చేసిన కర్మఫలాన్నీ స్వీకరించేవాడు.

203. స్థిరః - సృష్టినించి లయం వరకూ భయాన్ని కొల్పే విధంగా ఉండేవాడు.

204. అజః - పుట్టడమే ఇష్టంలేకుండా పుట్టి - ఇక మీదట పుట్టనే పుట్టనివాడు.

205. దుర్మర్షణః - ఎదిరించ వీలులేని పరాక్రమవంతుడు.

206. శాస్తా - జీవుల్ని శాసించి ధర్మాన్ని ఆచరింప చేసేవాడు.

207. విశ్రుతాత్మా - వేదం ప్రకారం జ్ఞాన సత్యాలని కల్గినవాడు.

208. సురారిహా - దేవతా శత్రువులైన రాక్షసులని వధించినవాడు.

209. గురుః - అజ్ఞానాంధకారాన్ని పూర్తిగా పోగొట్టేవాడు.

210. గురుతమః - దేవతాగురువైన బృహస్పతికి కూడా గురువు.

211. ధామ - అన్ని కోరికలనీ తీర్చుకోగల చోటు.

212. సత్యః - సత్యమే రూపంగా కలవాడు.

213. సత్యపరాక్రమః - సత్యగుణంతో పరలోకాన్ని కూడా గెల్చినవాడు.

214. నిమిషః - యోగనిద్రలోనికి వెళ్లగలిగినవాడు.

215. అనిమిషః - యోగనిద్రలో ఉండి కూడా లోకస్థితిని గమనించ గలవాడు.

216. స్రగ్వీ - 'వైజయంతి' అనే పూమాలని ఎప్పుడూ ధరించేవాడు.

217. వాచస్పతిరుదారధీః - వేదవాక్కులు లోకంలోకి ప్రచారం కావాలని భావించేవాడు.

218. అగ్రణీః - మార్గదర్శకుడు.

219. గ్రామణీః - కర్మఫలాన్ని సరిగా అందేలా చేసేవాడు.

220. శ్రీమాన్ - ఎవరూ ఎరుగనంతటి ప్రకాశం కలవాడు.

221. న్యాయః - జీవ - బ్రహ్మలకి భేదం లేదని నిరూపించేవాడు.

222. నేతా - ప్రపంచయంత్రాన్ని నడిపించేవాడు.

223. సమీరణః - ప్రాణవాయువే తన రూపమైనవాడు.

224. సహస్రమూర్ధా - వేల వేల శిరస్సులు (ఆలోచనలు) కలవాడు.

225. విశ్వాత్మా - విశ్వానికి ఆత్మరూపంగా ఉండేవాడు.

226. సహస్రాక్షః - వేల వేల కన్నులు (సాక్షి) కలవాడు.

227. సహస్రపాత్ - వేల వేల పాదాలు (స్థలాలు) కలవాడు.

228. ఆవర్తనః - కాలచక్రాన్ని తిప్పేవాడు.

229. నివృత్తాత్మా - సంసారంలో ఎన్నడూ చిక్కనివాడు.

230. సంవృతః - మాయచేత కప్పబడినట్లు కన్పించేవాడు.

231. సంప్రమర్దనః - దుర్మార్గులని మర్దింపజేసేవాడు.

232. అహస్సంవర్తకః - ప్రతిదినాన్నీ క్రమపద్ధతిలో నడిపేవాడు.

233. వహ్నిః - అగ్నిస్వరూపమైనవాడు.

234. అనిలః - ప్రజలకందరికీ 'శ్వాస' అయినవాడు.

235. దరణీధరః - భూమిని మోసేవాడు.

236. సుప్రసాదః - ద్వేషించేవారి విషయంలో కూడ అనుగ్రహాన్నిచ్చేవాడు.

237. ప్రసన్నాత్మా - నిర్మలంగా ఉండే ఆత్మకలవాడు.

238. విశ్వదృక్ - ప్రపంచాన్ని ధరించేవాడు.

239. విశ్వభుక్ - సృష్టిని అంతం చేసేవాడు.

240. విభుః - దేవతాధనమంతటినీ తనవద్ద నిలవ చేసేనవాడు.

241. సత్కర్తా - సత్పురుషులని సంమానించేవాడు.

242. సత్కృతః - పూజ్యులచేత పూజింపబడేవాడు.

243. సాధుః - న్యాయప్రవర్తన కలవాడు.

244. జహ్నుః - అజ్ఞానులందరికీ సంసారంలో సుఖాన్ని చూపించేవాడు.

245. నారాయణః - హృదయం లోపలా బయటా కన్పించగలవాడు.

246. నరః - ఉత్తమగమ్యానికి తీసుకుపోగలవాడు.

247. అసంఖ్యేయః - సంఖ్యానియమానికి లోబడనివాడు.

248. అప్రమేయాత్మా - 'ఇలాంటి వా'డని నిర్ణయింప వీలులేనివాడు.

249. విశిష్టః - అన్నిటికీ మించినవాడు.

250. శిష్టకృత్ - సజ్జనులని రక్షించేవాడు.

251. శుచిః - ఇతరుల ద్రవ్యవిషయంలో ఆసక్తి లేనివాడు.

252. సిద్ధార్థః - అన్ని కోరికలూ తీరినవాడు.

253. సిద్ధసంకల్పః - తన కోరికని నెరవేర్చుకోగలవాడు.

254. సిద్ధిదః - ప్రజల కర్మఫలాన్ని సకాలంలో అందిచ్చేవాడు.

255. సిద్ధిసాధనః - పని నెరవేర్చే సాధనమైనవాడు.

256. వృషాహీ - ధర్మపూర్వకమైన అర్చనలని స్వీకరించేవాడు.

257. వృషభః - కోరికలని వర్షించేవాడు.

258. విష్ణుః - ఏ ప్రాణి రూపాన్ని బట్టి ఆ ప్రాణిలో వ్యాపించి ఉండేవాడు.

259. వృషపర్వా - ధర్మపథం ద్వారానే కన్పించే లక్షణమున్నవాడు.

260. వృషోదరః - బ్రహ్మని కూడా తన ఉదరంగా చేసుకున్నవాడు.

261. వర్ధనః - జీవులని వృద్ధిపొందించేవాడు.

262. వర్ధమానః - జీవులలానే తానూ పెరుగుతూ ఉండే లక్షణమున్నవాడు.

263. వివిక్తః - లోకధర్మం తనకు అంటినా, తానుమాత్రం అంటకుండా ఉండగలవాడు.

264. శ్రుతిసాగరః - వేదవిశేషాలన్నిటికీ నిధి అయినవాడు.

265. సుభుజః - ప్రజారక్షణకి భుజాన్ని వినియోగించినవాడు.

266. దుర్ధరః - ఎవరూ మోయలేనంత శక్తికలవాడు.

267. వాగ్మీ - ఎదుటివారికి నొప్పి కలక్కుండా మాట్లాడగలవాడు.
268. మహేంద్రః - ఇంద్రునిక్కూడా అధికారి అయినవాడు.
269. వసుదః - ధనదాత.
270. వసుః - ధనమే తానైనవాడు.
271. నైకరూపః - ఏ అవతారంలో ఆ రూపాన్ని కలిగి ఉండేవాడు.
272. బృహద్రూపః - ఎంతో పెద్దరూపాన్ని కూడా వేయగలవాడు.
273. శిపివిష్టః - యజ్ఞపశువులో దాగి ఉండేవాడు.
274. ప్రకాశనః - ప్రపంచాన్నే ప్రకాశింపజేయగల్లవాడు.
275. ఓజస్తేజోద్యుతిధరః - బలమూ తేజస్సూ కాంతీ తానే అయినవాడు.
276. ప్రకాశాత్మా - ప్రకాశమే ఆత్మగా కలవాడు.
277. ప్రతాపనః - తన వేడిమితో తపింపజేసేవాడు.
278. ఋద్ధః - ధర్మ జ్ఞాన వైరాగ్యాలని బోధించేవాడు.
279. స్పష్టాక్షరః - ఓంకారమే తన రూపమైనవాడు.
280. మంత్రః - వేదమంత్రాలని బట్టి గుర్తించదగినవాడు.
281. చంద్రాంశుః - చల్లని కిరణాల నీయగలవాడు.

282. **భాస్కరద్యుతిః** - సూర్యునిలా ప్రకాశాన్నియగలవాడు.

283. **అమృతాంశూద్భవః** - చంద్రుని జన్మకూ్కాడా కారణమైనవాడు.

284. **భానుః** - వెలుగులకి వెలుగైనవాడు.

285. **శశబిందుః** - కుందేటిమచ్చ ఉన్న చంద్రునిలా ఆకర్షణీయుడై ప్రజల్ని రక్షించేవాడు.

286. **సురేశ్వరః** - దేవతలందఱికీ అధికారి.

287. **ఔషధమ్** - మనోవ్యాధికి 'మం' దైనవాడు.

288. **జగతస్సేతుః** - లోకాల మధ్య వారధిలాంటి వాడు.

289. **సత్య ధర్మ పరాక్రమః** - సత్యధర్మాలే తనకి పరాక్రమంగా కలవాడు.

290. **భూతభవ్యభవన్నాథః** - మూడు కాలాల్లోనూ ప్రార్థింపబడేవాడు.

291. **పవనః** - వాయురూపంగా ఉండేవాడు.

292. **పావనః** - వాయువుకి వీవనశక్తి నిచ్చేవాడు.

293. **అనలః** - వాసనే లేనివాడు.

294. **కామహా** - కోరికలని ధ్వంసం చేసేవాడు.

295. **కామకృత్** - మన్మథుణ్ణి సృష్టించినవాడు.

296. కాంతః - మనోహరుడైనవాడు.

297. కామః - తనమీది కోరికని పుట్టించేవాడు.

298. కామప్రదః - అడిగిన కోరికల నిచ్చేవాడు.

299. ప్రభుః - కోరికనిచ్చినా తాను అతీతంగానే ఉండేవాడు.

300. యుగాదికృత్ - యుగాల ఆదిని తన యిష్టం ప్రకారం చేసేవాడు.

301. యుగావర్తః - కాలం ముగియగానే మరో యుగానికి నడిపించేవాడు.

302. నైకమాయః - ఎన్నెన్నో మాయలని చూపేవాడు.

303. మహాశనః - ప్రలయ కాలంలో మహాభోజనాన్ని చేసేవాడు.

304. అదృశ్యః - ఏ జ్ఞానేంద్రియానికీ దొరకనివాడు.

305. వ్యక్తరూపః - యోగులకి మాత్రమే కన్పించే రూపాన్ని ధరించినవాడు.

306. సహస్రజిత్ - వేలకొలది రాక్షసుల్ని చంపినవాడు.

307. అనంతజిత్ - ప్రలయకాలంలో కూడా జయిస్తూనే ఉండేవాడు.

308. ఇష్టః - యజ్ఞాల ద్వారా పూజలని అందుకునేవాడు.

309. అవిశిష్టః - దేనితోనూ కలిసి ఉండనివాడు.

310. శిష్టేష్టః - జ్ఞానులకి మరింత ఇష్టుడైనవాడు.

311. శిఖండీ - నెమిలి ఫించాన్ని ధరించినవాడు.

312. నహుషః - మాయతో భూతాలని బంధించేవాడు.

313. వృషః - ధర్మ ప్రవర్తన కలవాడు.

314. క్రోధహా - క్రోధాన్ని (తనని ఆరాధిస్తే) అదుపు చేసుకోగల శక్తినిచ్చేవాడు.

315. క్రోధకృత్కర్తా - కోపంతో వచ్చే వ్యక్తి నుండి రక్షించేవాడు.

316. విశ్వబాహుః - ప్రపంచ రక్షణ సమర్థమైన బాహువులు కలవాడు.

317. మహీధరః - భూమిని తానుగా ధరించేవాడు.

318. అచ్యుతః - తానున్న చోటునుండి జారిపోనివాడు.

319. ప్రథితః - ఎవరికీ లేనంత ఖ్యాతిని పొందినవాడు.

320. ప్రాణః - ప్రతి ప్రాణిలోని చైతన్యమూ అయినవాడు.

321. ప్రాణదః - ప్రాణుల్లో కొన్నింటిని తుంచేసేవాడు.

322. వాసవానుజః - దేవేంద్రునికి తమ్ముడైనవాడు (వామన)

323. అపాంనిధిః - నీటికి స్థానమైన సముద్రమైనవాడు.

324. అధిష్ఠానమ్ - అన్నిటికీ ఆధారమేదో - తాను 'అది' అయినవాడు.

325. అప్రమత్తః - ఏమరుపాటుని ఎఱుగనే ఎఱుగనివాడు.

326. ప్రతిష్ఠితః - తనకి ఆధారం కూడ తానే అయినవాడు.

327. స్కందః - జారిపడిన కుమారుడే తానైనవాడు.

328. స్కందధరః - జారిపడ్డవారిని రక్షించేవాడు.

329. ధుర్యః - చెప్పలేని ప్రపంచ భారాన్ని మోసేవాడు.

330. వరదః - కష్టంతో ప్రార్థిస్తే ఆ కష్టం తొలిగే వరాన్నిచ్చేవాడు.

331. వాయువాహనః - ఏడు తీరుల వాయువునీ తానై మోస్తూ ప్రపంచరక్షణని చేసేవాడు.

332. వాసుదేవః - ప్రపంచంలో తానూ, తనలో ప్రపంచమూ కలవాడు.

333. బృహద్భానుః - తరిగిపోని కాంతికిరణ ప్రసారం కలవాడు.

334. ఆదిదేవః - సృష్టికి ముందైన రూపం కలవాడు.

335. పురందరః - శత్రు పురాలని నాశనం చేసేవాడు.

336. అశోకః - శోకం లేకుండా చేసేవాడు.

337. తారణః - సంసార కష్టం నించి దాటించగలవాడు.

338. తారః - జన్మ గురించిన భయాన్నించి తరింప జేసేవాడు.

339. శూరః - పరాక్రమవంతుడు.

340. శౌరిః - శూర వంశానికి చెందినవాడు. (వసుదేవుని పుత్రుడైన కృష్ణావతారం)

341. జనేశ్వరః - ప్రాణులందరినీ శాసించేవాడు.

342. అనుకూలః - వ్యక్తి చేసే సదాలోచనకి అనుకూలపడేవాడు.

343. శతావర్తః - ఎప్పుడూ అవతార రూపాల్తో అవతరిస్తూనే ఉండేవాడు.

344. పద్మీ - పద్మాకారపు చిహ్నాలు హస్తపాదాల్లో కలవాడు.

345. పద్మనిభేక్షణః - పద్మంతో సమానమైన ఆకర్షణీయమైన చూపులు కలవాడు.

346. పద్మనాభః - బొడ్డులో తామరపూవుని కలిగినవాడు.

347. అరవిందాక్షః - పద్మపత్రాల వంటి కళ్ళున్నవాడు.

348. పద్మగర్భః - ఉపాసనకాలంలో పద్మం వంటి హృదయంలో నిలిచి కన్పించేవాడు.

349. శరీరభృత్ - ప్రతి శరీరమూ తానే అయి ఉండేవాడు.

350. మహర్ధిః - చెప్పలేనంత సంపద కలవాడు.

351. ఋద్ధః - ప్రపంచపు ఆకారంతో ఉండేవాడు.

352. వృద్ధాత్మా - అతి ప్రాచీనుడు.

353. మహాక్షః - ఎవరికీ లేనంత విశేషమైన కన్నులుకలవాడు.

354. గరుడధ్వజః - గరుడుడు తనకి జెండాగా కలవాడు.

355. అతులః - ఏ విషయంలోనూ తనకి సాటి ఎవరూ లేనివాడు.

356. శరభః - శిథిలమయ్యే శరీరంలో, శరీరం ఉన్నంతకాలం శాశ్వతంగా ఉండేవాడు.

357. భీమః - తప్పుచేస్తున్న వ్యక్తుల్లో - ఆ యా వేళల్లో భయాన్ని కల్గించేవాడు.

358. సమయజ్ఞః - వ్యక్తుల సుఖ దుఃఖ భయ సమయాలని గూర్చి స్పష్టంగా తెలిసినవాడు.

359. హవిర్హరిః - యజ్ఞాలలోని హవిస్సుని గ్రహించేవాడు.

360. సర్వలక్షణలక్షణ్యః - సర్వలక్షణాలతోనూ ఉండేవాడు.

361. లక్ష్మీవాన్ - వక్షఃస్థలం మీద లక్ష్మిని ఎల్లప్పుడూ కలిగి ఉండేవాడు.

362. సమితిం జయః - యుద్ధంలో గెలుపునే సాధించేవాడు.

363. విక్షరః - నాశనమనే విధానమే లేనివాడు.

364. రోహితః - ప్రలయం చివరికాలంలో ఎఱ్ఱని మత్స్య రూపాన్ని ధరించేవాడు.

365. మార్గః - త్రోవగా దర్శనమిచ్చేవాడు.

366. హేతుః - కారణం అయినవాడు.

367. దామోదరః - లోకాలని నిత్యం రక్షిస్తూ ఉండేవాడు.

368. సహః - ఓర్పుతో ఉండేవాడు.

369. మహీధరః - భూమిని తనపై ధరించేవాడు.

370. మహీభాగః - అనేక భోగాలని అనుభవించేవాడు.

371. వేగవాన్ - మిక్కిలి వేగం కలవాడు.

372. అమితాశనః - తృప్తి లేక ప్రలయకాలంలో భుజించేవాడు.

373. ఉద్భవః - పుట్టించుకోవడానికి కారణమై పుట్టేవాడు.

374. క్షోభణః - కల్లోలపరచేవాడు. (దుర్జనుల మనస్సులని మాత్రమే)

375. దేవః - ప్రపంచాన్ని ఒక ఆటగా భావించి ఆడుకునేవాడు.

376. శ్రీగర్భః - సమస్త సంపదలూ ఉన్న ప్రపంచాన్ని తన గర్భంలో పెట్టుకునేవాడు.

377. పరమేశ్వరః - శాసకులందరినీ పై అధికారిగా శాసించేవాడు.

378. కరణమ్ - ప్రపంచపు పుట్టుకకి పనిముట్టైనవాడు.

379. కారణమ్ - ఒక కార్యసాధనలో కారణమయ్యేవాడు.

380. కర్తా - స్వతంత్రుడు.

381 విశిరా - విచిత్రంగా ప్రపంచనిర్మాణాన్ని చేసేవాడు

382 నవాన: - తనని గూర్చి ఏ మాత్రమూ తెలియ పలుకానివాడు.

383 సుహ: - దాగిన నిజరూపం కలవాడు.

384 వ్యవసాయః - జ్ఞానమే తన రూపమైనవాడు.

385. వ్యవస్థానః - ఒక వ్యవస్థని చేసి పరిపాలించేవాడు.

386. సంస్థానః - అందరూ కోరుకునే గమ్యస్థానమైనవాడు

387. స్థానదః - ఎవరెవరి కర్మలకి అనుగుణంగా వారివారి ఆ కర్మఫలాన్నిచ్చేవాడు.

388. ధ్రువః - శాశ్వతంగా ఉండేవాడు.

389. పరర్ధిః - ఎవరికీ చెందలేనంత సంపద కలవాడు.

390 పరమస్పష్టః - తన తేజస్సుతో ఎంతటి దానినైనా స్పష్టంగా చూడగలవాడు.

391 తుష్టః - ఎప్పుడూ ఆనందాన్ని కలిగించేవాడు.

392 పుష్టః - జ్ఞానం నిండి పరిపూర్ణుడైనవాడు

393. **శుభేక్షణః** - 'చూస్తేచాలు' - శుభాన్ని కల్గించగలవాడు.

394. **రామః** - అందరినీ ఆనందపరిచేవాడు.

395. **విరామః** - జీవులకి విశ్రాంతి అయినవాడు.

396. **విరజః** - విషయవాసనలలో ఆసక్తి లేనివాడు.

397. **మార్గః** - మోక్షార్థులైనవారికి త్రోవ అయినవాడు.

398. **నేయః** - జీవునికి గమ్యమైనవాడు.

399. **నయః** - జీవుణ్ణి పరమాత్మ వద్దకి చేర్చేవాడు.

400. **అనయః** - తనని తానే నడిపించుకునే వాడు.

401. **వీరః** - మహాపరాక్రమశాలి.

402. **శక్తిమతాం శ్రేష్ఠః** - శక్తి కల అందరికంటె శ్రేష్ఠుడు.

403. **ధర్మః** - ధర్మమే రూపమైనవాడు.

404. **ధర్మవిదుత్తమః** - అన్ని జాతుల ధర్మాలనీ తెలిసిన వారికంటె శ్రేష్ఠుడు.

405. **వైకుంఠః** - ప్రపంచ క్షేమాన్ని కోరుతూండేవాడు.

406. **పురుషః** - శరీరమనే పురంలో నివసించేవాడు.

| | | | |
|---|---|---|---|
| 407. | ప్రాణః | - | తన చేష్టలే అమలు జరిగేలా చేసుకునేవాడు. |
| 408. | ప్రాణదః | - | ప్రాణరూపంలో ఉండి ప్రాణులని ఖండించేవాడు. |
| 409. | ప్రణవః | - | ఓంకారానికి సరైన అర్థమైనవాడు. |
| 410. | పృథుః | - | మన వీలుకోసం కన్పిస్తూ ఉండేవాడు. |
| 411. | హిరణ్యగర్భః | - | సృష్టికి మూలమైన అండం తన గర్భంలో కలవాడు. |
| 412. | శత్రుఘ్నః | - | దేవతల శత్రువులనందరినీ చంపేవాడు. |
| 413. | వ్యాప్తః | - | ప్రతి స్థలంలోనూ కార్య-కారణ సంబంధం కల్గి కన్పించేవాడు. |
| 414. | వాయుః | - | భూమిలో దాగిన వాయురూపమైనవాడు. |
| 415. | అధోక్షజః | - | అంతర్ముఖులకి మాత్రమే కన్పించేవాడు. |
| 416. | ఋతుః | - | కాలస్వరూపమైనవాడు. |
| 417. | సుదర్శనః | - | మనస్సుని హరించే చక్కని రూపమున్నవాడు. |
| 418. | కాలః | - | ఎవరిదెంతకాలమో లెక్కిస్తూ ఉండేవాడు. |
| 419. | పరమేష్ఠీ | - | తనలోనే తానుండే స్వభావమున్నవాడు. |

420. పరిగ్రహః - తానే ఇచ్చిన దేన్నిచ్చినా, తెలియనివానిలా స్వీకరించేవాడు.

421. ఉగ్రః - పంచభూతాలూ ఎవరిని చూసి భయపడతాయో అతడు.

422. సంవత్సరః - సమస్తభూతాలూ తనలోనే కలవాడు.

423. దక్షః - సరైన పనిని సరైన కాలంలో చేసే సమర్థత కలవాడు.

424. విశ్రామః - పంచభూతాలకీ ముగింపుచోటైనవాడు.

425. విశ్వదక్షిణః - ప్రపంచజనులు మొత్తానికీ కూడా లేని నేర్పు కలవాడు.

426. విస్తారః - లోకాలని విస్తరింపజేసినవాడు.

427. స్థావరఃస్థాణుః - కదలని భూమిని కూడా కదిలే తనలో ఉంచుకునేవాడు.

428. ప్రమాణమ్ - ఒక వాదానికి కావాలసిన ప్రమాణమే తన రూపైనవాడు.

429. బీజమవ్యయమ్ - నాశనం కాని విత్తనం వంటివాడు.

430. అర్థః - అందరిచేతా కోరబడేవాడు.

431. అనర్థః - ఏ కోరికా లేనివాడు.

432. మహాకోశః - ఐదుకోశాలకీ ఆధారమైనవాడు.

433. మహాభోగః - భోగానికి లోటు లేనివాడు.

434. మహాధనః - అయిపోవడమనేది ఎప్పుడూ లేనివాడు.

435. అనిర్విణ్ణః - నిర్వేదమే లేనివాడు.

436. స్థవిష్ఠః - విరాడ్రూపంతో వ్యాపించి ఉన్నవాడు.

437. అభూః - భూమి స్వరూపమైనవాడు.

438. ధర్మయూపః - ధర్మాలన్నీ ఎవరికి కట్టుబడి ఉంటాయో అతడు.

439. మహామఖః - యజ్ఞాల గొప్పదనానికి కారణమైనవాడు.

440. నక్షత్రనేమిః - నక్షత్ర చక్ర మధ్యభాగంలో ఉండేవాడు.

441. నక్షత్రీ - తారల ప్రకాశాన్ని తీసుకుని ప్రకాశించేవాడు.

442. క్షమః - చెప్పలేని సహనగుణం కలవాడు.

443. క్షామః - అన్నీ నశించినా మిగిలి ఉండేవాడు.

444. సమీహనః - ప్రలయారంభ - అంత్యకాలాల్లో చక్కగా ఆలోచించి నిర్ణయం తీసుకునేవాడు.

445. యజ్ఞః - యజ్ఞమే తానైనవాడు.

446. ఇజ్యః - యజ్ఞఫలాన్ని పొందేవాడు.

447. మహేజ్యః - మోక్షాన్ని ఇచ్చేవాడు.

448. క్రతుః - యజ్ఞరూపం అయినవాడు.

449. సత్రమ్ - యజ్ఞాన్ని రక్షించేవాడు.

450. సతాంగతిః - మోక్షం కోరేవారికి గతి అయినవాడు.

451. సర్వదర్శీ - ప్రతి విషయాన్నీ నిశితంగా దర్శించేవా

452. విముక్తాత్మా - సహజంగా ముక్తిని పొందినవాడు.

453. సర్వజ్ఞః - జ్ఞానరూపుడు.

454. జ్ఞానముత్తమమ్ - ఉత్తమ జ్ఞానమే తానైనవాడు.

455. సువ్రతః - చక్కటి ప్రతిజ్ఞలని చేసి నెరవేర్చేవాడు.

456. సుముఖః - దుఃఖంలో కూడ చిరునవ్వు మాయనివాడు.

457. సూక్ష్మః - సూక్ష్మరూపంతో ఉండేవాడు.

458. సుఘోషః - వేదరూపధ్వని కలవాడు.

459. సుఖదః - సుఖవిధానాన్ని కల్గించేవాడు.

460. సుహృద్ - ఉపకారం చేసే లక్షణమున్నవాడు.

461. మనోహరః - మనస్సుని ఆకర్షించేవాడు.

462. జితక్రోధః - కోపాన్ని జయించినవాడు.

463. వీరబాహుః - ధర్మరక్షణకై బిగించిన పిడికిలి కల వీరబాహువులున్నవాడు.

464. విదారణః - అధర్మపరుల్ని చీల్చి చెండాడేవాడు.

465. స్వాపనః - జీవులని మాయతో నిద్రపుచ్చేవాడు.

466. స్వవశః - సృష్టి స్థితి లయాలని తన వశంలో ఉంచుకునేవాడు.

467. వ్యాపీ - కారణం తానే అయినా అన్నిటా తన ప్రమేయం కలిగనవాడు.

468. నైకాత్మా - అనేకవిధాలుగా కన్పించేవాడు.

469. నైకకర్మకృద్ - ఎన్నో పనులని ఏకకాలంలో చేయగలవాడు.

470. వత్సరః - అంతా తనలోనే నివసించేలా చేయగలవాడు.

471. వత్సలః - భక్తుల యెడ చెప్పలేని వాత్సల్యం కలవాడు.

472. వత్సీ - వత్సాలైన (పిల్లలైన) ప్రజలని నిరంతరం వాత్సల్యబుద్ధితో కాపాడేవాడు.

473. రత్నగర్భః - రత్నాలే తన గర్భంలో కలవాడు.

474. ధనేశ్వరః - సర్వ ధనాలకీ (పుత్ర - పశు - ఆరోగ్య..........) అధిపతి

475. ధర్మగుప్ - ధర్మాన్ని రక్షించేవాడు.

476. ధర్మకృద్ - ధర్మాన్నే ఆచరించేవాడు.

477. ధర్మీ - తానాచరించినదంతా ధర్మమే ఔ॰ ఉండేవాడు.

478. సత్ - అసత్యం కానివాడు.

479. అసత్ - అసత్యంగా కన్పిస్తూ లోపల సత్యమైనవాడ

480. క్షరమ్ - నశించే జీవరాశి అయినవాడు.

481. అక్షరమ్ - చైతన్యానికి ఆధారమైన ఆత్మశక్తి అయినవాడ

482. అవిజ్ఞాతా - భాగవతులక్కూడా అందని లక్షణాల కలవాడు.

483. **సహస్రాంశుః** - సూర్యునిక్కూడా తేజస్సునిచ్చి సూర్యుడైనవాడు.

484. **విధాతా** - ఆదిశేషుడూ... దిగ్గజాలూ......... ఇలా వీటినన్నింటినీ విశేషంగా ధరించినవాడు.

485. **కృతలక్షణః** - లోకంలో కన్పించే అన్ని ఉదాహరణలకీ లక్షణం తానే అయినవాడు.

486. **గభస్తినేమిః** - కాలచక్ర మధ్యరూపంలో ఉండేవాడు.

487. **సత్వస్థః** - ప్రతివ్యక్తిలోనూ ఉన్న సత్త్వగుణాన్ని ఆశ్రయించి ఉండేవాడు.

488. **సింహః** - హద్దుమీరిన వారిని వధించేవాడు.

489. **భూతమహేశ్వరః** - సర్వతంత్ర స్వతంత్రుడు.

490. **ఆదిదేవః** - సమస్తానికీ ఆది దేవుడైనవాడు.

491. **మహాదేవః** - దేవతలక్కూడా దేవుడు.

492. **దేవేశః** - దేవతలందఱినీ శాసించగలవాడు.

493. **దేవభృద్గురుః** - ఇంద్రుని అజ్ఞానాన్ని కూడ తొలగించగలవాడు.

494. ఉత్తరః - అందరికంటె అధికుడు.

495. గోపతిః - గోవులకాపరి వేషాన్ని వేసి మెప్పునందినవాడు.

496. గోప్తా - రక్షించే స్వభావ మున్నవాడు.

497. జ్ఞానగమ్యః - కేవలం జ్ఞానం ద్వారానే కనిపించేవాడు.

498. పురాతనః - మిక్కిలి ప్రాచీనుడు.

499. శరీరభూతభృత్ - పంచభూతాలనీ ధరించినవాడు.

500. భోక్తా - ఆనందాన్ని అనుభవించేవాడు.

501. కపీంద్రః - వానరులందరికీ ప్రభువు.

502. భూరిదక్షిణః - నిస్వార్థంగానూ, ధార్మికంగానూ ఎంతెం దక్షిణని ఇచ్చేవాడు.

503. సోమపః - సోమరసాన్ని అనేక స్థలాల్లో స్వీకరించేవాడు.

504. అమృతపః - 'అమృతమ'స్తని అనగానే స్వీకరించేవాడు.

505. సోమః - ఉమతో కూడిన శంకర రూపమైనవాడు.

506. పురుజిత్ - అవలీలగా ఎందరినైనా జయించేవాడు.

507. పురుసత్తమః - సర్వోత్తముడు.

508. వినయః - నీతిశాస్త్ర విషయంలో విశేష ప్రజ్ఞ కలవాడు.

509. జయః - జయించే స్వభావమున్నవాడు.

510. సత్యసంధః - సత్యలక్షణం కలవాడు.

511. దాశార్హః - దశార్హ వంశంలో పుట్టినవాడు.

512. సాత్వతాం పతిః - వైష్ణవాగమాన్ని చెప్పి దానికి అధికారి అయినవాడు.

513. జీవః - ప్రాణాలని ధరించి క్షేత్రజ్ఞుడై ఉండేవాడు.

514. వినయితా సాక్షీ - ప్రజల వినయాన్ని చూస్తూ ఉండేవాడు.

515. ముకుందః - ముక్తిని ఇచ్చేవాడు.

516. అమితవిక్రమః - మూడు పాదాల్లో బ్రహ్మానందాన్ని ఆక్రమించగలవాడు.

517. అంభోనిధిః - దేవ, మనుష్య, పితృ, అసురులనే నలుగురికీ ఆధారమైనవాడు.

518. అనంతాత్మా - అన్నిటికీ స్వరూపమైనవాడు.

519. మహోదధిశయః - ప్రలయకాల సముద్రం మీద పరుండేవాడు.

520. అంతకః - భూతాలకి ముగింపుని చేసేవాడు.

521. అజః - మన్మధునిలా ఉండేవాడు.

522. మహార్హః - పుజనించి యాగం-వరకూ ఆరాధ్యుడయ్యే అర్హతని సంపాదించినవాడు.

523. స్వాభావ్యః - ఏదీ తనకి స్వభావం కానివాడు.

524. జితామిత్రః - బాహ్య అంతశ్శత్రువులని జయించినవాడు.

525. ప్రమోదనః - ధ్యానం చేయుగానే సంతోషాన్ని కల్గించేవాడు.

526. ఆనందః - తనని దర్శించిన అందరికీ అనుగ్రహాన్ని ఇస్తూండేవాడు.

527. నందనః - ఆనందానికి కారణమైనవాడు.

528. నందః - అష్టసిద్ధులూ తన అధీనంలో కలవాడు.

529. సత్యధర్మా - పలికే పద్ధతిలోనూ ఆచరించే తీరులోనూ ప్రవర్తన ఎప్పుడూ ఒకేవిధంగా ఉండేవాడు.

530. త్రివిక్రమః - మూడు లోకాలనీ ముమ్మారు దాటినవాడు.

531. మహర్షిః కపిలాచార్యః - కపిలావతారాన్ని ఎత్తినవాడు.

532. కృతజ్ఞః - సృష్టి - సృష్టికర్తా కూడా తానే ఐనవాడు.

533. మేదినీపతిః - భూమిని అదుపులో ఉంచుకున్నవాడు.

534. త్రిపదః - భూ-అంతరిక్ష - స్వర్గాలు తన స్థానమైనవాడు.

535. త్రిదశాధ్యక్షః - దేవతలకందరికీ అధికారి.

536. మహాశృంగః - ప్రలయకాలంలో శృంగాన్ని (ఒక విధమైన కొమ్ము) పట్టుకుని ఉండేవాడు.

537. కృతాంతకృత్ - జగత్తుని సంహరించేవాడు.

538. మహావరాహః - ఆదివరాహరూపంతో ఉన్నవాడు.

539. గోవిందః - వేదవాక్కుల ద్వారా మాత్రమే తెలిసేవాడు.

540. సుషేణః - మహాసైన్యం తన వెంట ఉన్నవాడు.

541. కనకాంగదీ - బంగారు అంగదాలని (భుజాలంకారాలు) ధరించినవాడు.

542. గుహ్యః - ఉపనిషత్తుల ద్వారా తెలుసుకోదగినవాడు.

543. గభీరః - అన్నీ తెలిసి కూడా ఏమీ ఎరగనట్టుండేవాడు.

544. గహనః - ఎంతో కష్టమ్మీద తెలియవీలైనవాడు.

545. గుప్తః - మాటకీ మనసుకీ కూడ అందనివాడు.

546. చక్రగదాధరః - మనశ్చక్రాన్నీ, బుద్ధి గదనీ, తన వద్దే ఉంచుకునేవాడు.

547. వేధాః - సృష్టికర్త.

548. స్వాంగః - తనకు తానే సహాయపడేలా చేసుకునేవాడు.

549. అజితః - అపజయాన్ని పొందనే పొందనివాడు.

550. కృష్ణః - నల్లని శరీరం కల వ్యాసుని అవతారమైనవాడు.

551. దృఢః - సమర్థుడు.

552. సంకర్షణోऽచ్యుతః - ఏ మాత్రపు జారుపాటూ లేనివాడు.

553. వరుణః - సాయంకాలపు సూర్యరూపమైనవాడు.

554. వారుణః - వరుణుని పుత్రుడైన అగస్త్యుడూ లేదా వరుణుని రూపమైనవాడు.

555. వృక్షః - కదలిక లేక స్వర్గంలో ఉండేవాడు.

556. పుష్కరాక్షః - హృదయకమలం నిండుగా వ్యాపించి ఉండేవాడు.

557. మహామనాః - మనసుతోనే జగత్తుని చేసేవాడు.

558. భగవాన్ - సర్వవిషయాలనీ సమగ్రంగా తెలిసినవాడు.

559. భగహా - సంహారకాలంలో తన లక్షణాన్ని (రక్షణా) ఉపసంహరించుకునేవాడు.

560. ఆనందీ - నిత్యం ఆనందంగా ఉండేవాడు.

561. వనమాలీ - వనమాలని ధరించేవాడు.

562. హలాయుధః - నాగలిపట్టిన బలరాముడైనవాడు.

563. ఆదిత్యః - అదితికశ్యపుల సంతానమైన వామనుడు.

564. జ్యోతిరాదిత్యః - సూర్యమండల మధ్యంలో ఉండేవాడు.

565. సహిష్ణుః - శీతోష్ణాలని సహించుకుని ఉండేవాడు.

566. గతిసత్తమః - అందరికీ గతి అయినవాడు.

567. సుధన్వా - చక్కని వింటిని ధరించినవాడు.

568. ఖండపరశుః - గండ్రగొడ్డలి ధరించిన పరశురాముని అవతారమైనవాడు.

569. ద్రావిణః - దుర్మార్గులని పరుగెత్తించేవాడు.

570. ద్రవిణప్రదః - ధనాన్ని కోరినవారికి పుష్కలంగా ఈయగల్గినవాడు.

571. దివఃస్పృక్ - స్వర్గాన్ని స్పృశిస్తూ ఉండేవాడు.

572. సర్వదృగ్వ్యాసః - సమస్తానికీ కన్నైనవాడు.

573. వాచస్పతిరయోనిజః - సర్వవిద్యలకీ అధిష్ఠాత.

574. త్రిసామా - సామంలోని మూడుమంత్రాల ద్వారా స్తుతింపబడేవాడు.

575. సామగః - సామవేదాన్ని గానం చేసేవాడు.

576. సామః - వేదాల్లో ఒకటైన సామవేదమైనవాడు.

577. నిర్వాణమ్ - చెప్పలేనంత సుఖమే తానైనవాడు.

578. భేషజమ్ - సంసారమనే వ్యాధికి ఔషధమైనవాడు

579. భిషక్ - సంసార రోగానికి వైద్యుడైనవాడు.

580. సంన్యాసకృత్ - మోక్షం కోరినవారికి సంన్యాసాన్ని ఇచ్చేవాడు.

581. శమః - జ్ఞానానికి అవసరమైన శమం తనవద్ద కలవాడు.

582. శాంతః - విషయసుఖాలు అక్కఱలేనివాడు.

583. నిష్ఠా - లయకాలంలో అన్నిటికీ నివాసమైనవాడు.

584. శాంతిః - బ్రహ్మస్వరూపమైనవాడు.

585. పరాయణమ్ - వెనక్కి రావడమనేది లేనివాడు.

586. శుభాంగః - సుందరమైన అవయవ విధానం కలవాడు.

587. శాంతిదః - శాంతిని నిశ్చయంగా ఇచ్చేవాడు.

588. స్రష్టా - సృష్టికర్త

589. కుముదః - భూలోకంలో పుట్టి ఆనందాన్ని పొందేవాడు.

590. కువలేశయః - ఆదిశేషుని ఉదరంలో పరుండేవాడు.

591. గోహితః - గోవులకి హితాన్ని కల్గించేవాడు.

592. గోపతిః - భూమికి భర్త.

593. గోప్తా - ప్రపంచరక్షకుడు.

594. వృషభాక్షః - తన చూపే ధర్మమైనవాడు.

595. వృషప్రియః - ధర్మమే తనకు ఇష్టమైనదిగా కలవాడు.

596. అనివర్తీ - ఎలాటి కష్టస్థితి అయినా ధర్మాన్నించి మరలనివాడు.

597. నివృత్తాత్మా - విషయసుఖాల ఆలోచన లేనివాడు.

598. సంక్షేప్తా - సంహారకాలంలో సంక్షేపించేవాడు.

599. క్షేమకృత్ - ఉన్న జగత్తుకి క్షేమాన్ని కల్గించేవాడు.

600. శివః - స్మరించినంత మాత్రాన పవిత్రత నిచ్చేవాడు.

601. శ్రీవత్సవక్షాః - 'శ్రీవత్స' మనే మచ్చ హృదయం మీద కలవాడు.

602. శ్రీవాసః - 'లక్ష్మి' ఉన్నందుకానవాలుగా మచ్చ తన ఎదపై ఉన్నవాడు.

603. శ్రీపతిః - లక్ష్మితో కలిసి వివాహంలో యాగాన్ని చేసినవాడు.

604. శ్రీమతాం వరః - నవబ్రహ్మల కంటె శ్రేష్ఠుడు.

605. శ్రీదః - సంపదనిచ్చేవాడు.

606. శ్రీశః - సంపద తన అధీనంలో కలవాడు.

607. శ్రీనివాసః - లక్ష్మీవంతుల వద్దే ఉండేవాడు.

608. శ్రీనిధిః - సంపదలకు నిధి అయినవాడు.

609. శ్రీవిభావనః - అనేక సంపదల నిచ్చేవాడు.

610. శ్రీధరః - నిత్యమూ సంపదని కలిగి ఉండేవాడు.

611. శ్రీకరః - తనని సేవించేవారికి సంపదనిచ్చేవాడు.

612. శ్రేయః - పరమసుఖప్రాప్తి స్వరూపంగా కలవాడు.

613. శ్రీమాన్ - లక్ష్మిని తనదానిగా చేసుకున్నవాడు.
614. లోకత్రయాశ్రయః - ముల్లోకాలకీ ఆశ్రయమైనవాడు.
615. స్వక్షః - చక్కని కళ్లు కలవాడు.
616. స్వంగః - చూడముచ్చటైన అవయవాలున్నవాడు.
617. శతానందః - అనేకవిధాల ఆనందంతో జీవింపచేసేవాడు.
618. నందిః - పరమానంద స్వరూపుడు.
619. జ్యోతిర్గణేశ్వరః - జ్యోతిర్గణాలన్నింటికీ ప్రభువు.
620. విజితాత్మా - ఆత్మని జయించినవాడు.
621. అవిధేయాత్మా - చెప్ప వీలుకాని స్వరూపమున్నవాడు.
622. సత్కీర్తిః - సత్యమైన కీర్తికలవాడు.
623. ఛిన్న సంశయః - ఏ విషయంలోనూ సందేహం లేనివాడు.
624. ఉదీర్ణః - సమస్తం కంటె అధికుడు.
625. సర్వతశ్చక్షుః - చైతన్యంతో అన్నింటినీ చూడగలవాడు.
626. అనీశః - తనకంటె పైన మరో అధికారి లేనివాడు.
627. శాశ్వతః స్థిరః - ఎప్పుడూ వికారాన్ని పొందనివాడు.

628. భూశయః - (రామకథలో) భూమిపై పరున్నవాడు.

629. భూషణః - భూమికి అలంకారమైనవాడు.

630. భూతిః - ఐశ్వర్యమే రూపంగా కలవాడు.

631. శోకః - దుఃఖాన్ని ఎఱుగనివాడు.

632. శోకనాశనః - స్మరించినంతలోనే శోకాన్ని పోగొట్టేవాడు.

633. అర్చిష్మాన్ - తేజస్సే రూపంగా కలవాడు.

634. అర్చితః - బ్రహ్మాదులచేత కూడ పూజలందేవాడు.

635. కుంభః - తనలోనే అన్నింటినీ దాచి ఉంచుకున్నవాడు.

636. విశుద్ధాత్మా - పరిశుద్ధాత్మ కలవాడు.

637. విశోధనః - పాపాలని తొలగించగలవాడు.

638. అనిరుద్ధః - ఎప్పుడూ అడ్డగింపబడనివాడు.

639. అప్రతిరథః - ప్రతిపక్షమే లేనివాడు.

640. ప్రద్యుమ్నః - మిక్కిలి తేజస్సు కలవాడు.

641. అమిత విక్రమః - 'ఇంత' అని చెప్పలేని పరాక్రమమున్నవాడు.

642. కాలనేమినిహా - కాలనేమిని వధించినవాడు.

643. వీరః - వీరుడు.,

644. శౌరిః - శూరుడనే వాని వంశంలో పుట్టినవాడు.

645. శూరజనేశ్వరః - శూరులైన ఇంద్రాదులకి కూడ ప్రభువు.

646. త్రిలోకాత్మా - ముల్లోకాలకీ ఆత్మ అయినవాడు.

647. త్రిలోకేశః - తన ఆజ్ఞకనుగుణంగా లోకాలని నడిపించేవాడు.

648. కేశవః - త్రిమూర్తుల శక్తులూ తనకి కలవాడు.

649. కేశిహా - కేశి రాక్షసుణ్ణి చంపినవాడు.

650. హరిః - సంసారాన్ని హరించగలవాడు.

651. కామదేవః - మన్మథుడు

652. కామపాలః - కోరికలని తీర్చేవాడు.

653. కామీ - కోరికలు తీరినవాడు.

654. కాంతః - మనోహరుడు.

655. కృతాగమః - శాస్త్రపురాణాదులన్నీ తననించే వెలువడినవాడు.

656. అనిర్దేశ్యవపుః - చెప్పవీలులేని శరీరం కలవాడు.

657. విష్ణుః - మిక్కిలిగా వ్యాపించినవాడు.

658. వీరః - విజయమే లక్షణంగా కలవాడు.

659. అనంతః - ముగింపు లేనివాడు.

660. ధనంజయః - దిగ్విజయం ద్వారా ఎంతో ధనాన్ని తేగలవాడు.

661. బ్రహ్మణ్యః - తపస్సు మొదలైనవానికి కష్టం రాకుండా చేసేవాడు.

662. బ్రహ్మకృత్ - తపస్సు, వేదం, బ్రాహ్మణులూ, జ్ఞానమనే నాల్గింటికీ కర్త.

663. బ్రహ్మ - బ్రహ్మరూపుడు.

664. బ్రహ్మ - బ్రహ్మపదార్థమయినవాడు.

665. బ్రహ్మవివర్ధనః - తపస్సుని వృద్ధి చేసేవాడు.

666. బ్రహ్మవిత్ - వేదాన్నీ వేదార్థాన్నీ తెలిసినవాడు.

667. బ్రాహ్మణః - బ్రాహ్మణరూపంతో వేదాలని ప్రవచించేవాడు.

668. బ్రహ్మీ - తపస్సు మొదలైన నాల్గింటినీ రక్షిస్తుండేవాడు.

669. బ్రహ్మజ్ఞః - వేదాలని తెలుసుకున్నవాడు.

670. బ్రాహ్మణప్రియః - బ్రాహ్మణులకి ప్రియమైనవాడు.

671. మహాక్రమః - పెద్ద అడుగులు కలవాడు.

672. మహాకర్మా - గొప్ప పనికలవాడు.

673. మహాతేజాః - గొప్ప తేజస్సు కలవాడు.

674. మహోరగః - మహాసర్పమైన వాసుకి

675. మహాక్రతుః - మహాయజ్ఞరూపుడు.

676. మహాయజ్వా - యజ్ఞాలని అనేకంగా చేసేవాడు.

677. మహాయజ్ఞః - బ్రహ్మభావనతో నిత్యమూ హోమం చేయబడే చోటైనవాడు.

678. మహాహవిః - మహాహవిస్సే తన రూపమైనవాడు.

679. స్తవ్యః - మరెవరూ తనకి స్తుతించడానికి లేనివాడు.

680. స్తవప్రియః - తనని స్తుతించినంత మాత్రాన పొంగిపోయేవాడు.

681. స్తోత్రమ్ - స్తుతిచేయవీలైన అక్షరసమూహమైనవాడు.

682. స్తుతిః - స్తుతికోసం ఉన్న పద్యం - శ్లోకం - పాట అయినవాడు.

683. స్తోతా - స్తుతించేవాడు.

684. రణప్రియః - శంఖచక్రాదులతో యుద్ధానికి సిద్ధమయ్యేవాడు.

685. పూర్ణః - అన్ని శక్తులూ నిండి ఉన్నవాడు.

686. పూరయితా - అందరినీ సంపదలతో నింపేవాడు.

687. పుణ్యః - పాపాలని పోగొట్టగలిగేవాడు.

688. పుణ్యకీర్తిః - ఎవరి చరిత్ర గూర్చిన చర్చ పుణ్యాన్ని కల్గిస్తుందో అతడు.

689. అనామయః - లోపలి వెలుపల బాధల్లని తొలగించేవాడు.

690. మనోజవః - మనస్సుతో సమానమైన వేగం కలవాడు.

691. తీర్థకరః - బ్రహ్మసృష్టికి పూర్వమే విద్యలనీ వాటికైౖ సిద్ధాంతాలనీ ఏర్పాటుచేసినవాడు.

692. వసురేతాః - బంగారురంగు తేజస్సుకలవాడు.

693. వసుప్రదః - ధనాన్ని ఇచ్చేవాడు.

694. వసుప్రదః - ఉత్తమ ఫలమైన మోక్షాన్ని ఇచ్చేవాడు.

695. వాసుదేవః - వసుదేవుని పుత్రుడు.

696. వసుః - తనలో సమస్తమూ, సమస్తంలో తానుగా ఉండగలిగినవాడు.

697. వసుమనాః - ఎప్పుడూ ఒకేతీరు మనస్తత్వంతో ఉండేవాడు.

698. హవిః - ఏ త్యాగానికైనా సిద్ధమైయున్నవారి ఆరాధనని అందుకొనేవాడు.

699. సద్గతిః - సత్పురుషులకి గమ్యమైనవాడు.

700. సత్కృతిః - జగద్రక్షయే తనకి ఉత్తమకార్యమైనవాడు.

701. సత్తా - బ్రహ్మపదార్థమే తన రూపమైనవాడు.

702. సద్భూతిః - శాశ్వతంగా ఉండే రూపం కలవాడు.

703. సత్పరాయణః - సజ్జనులకి గమ్యమైనవాడు.

704. శూరసేనః - శౌర్యమున్న సేన తనవెంట కలవాడు.

705. యదుశ్రేష్ఠః - యాదవ వంశంలో శ్రేష్ఠుడైనవాడు.

706. సన్నివాసః - సజ్జనులకి ఆశ్రయమైనవాడు.

707. సుయామునః - యమునా తీరంలో తనకి సహాయులుగా ఎందరో కలవాడు.

708. భూతావాసః - సమస్త భూతాలకీ నిలయుడు.

709. వాసుదేవః - మాయతో ప్రపంచాన్ని కప్పివేసేవాడు.

710. సర్వాసునిలయః - సమస్త ప్రాణాలనీ లయంచేసేవాడు.

711. అనలః - మితిలేని శక్తి సంపదలున్నవాడు.

712. దర్పహా - మదాన్ని అణిచివేసేవాడు.

713. దర్పదః - మెత్తన్ని మనసువారికి గర్వాన్ని కలిగించేవాడు.

714. దృప్తః - అమృతసారాన్ని ఆస్వాదించే కారణంగా తృప్తుడై ఉండేవాడు.

715. దుర్ధరః - అతికష్టమ్మీద హృదయంలో స్థిరంగా ఉండేవాడు.

716. అపరాజితః - లోపలి వెలుపలి శత్రువుల ద్వారా ఓటమిని పొందనివాడు.

717. విశ్వమూర్తిః - ప్రపంచమే ఆకారంగా కలవాడు.

718. మహామూర్తిః - విశాలమైన రూపం కలవాడు.

719. దీప్తమూర్తిః - ప్రకాశిస్తున్న దీపం వంటివాడు.

720. అమూర్తిమాన్ - పూర్వకర్మానుగుణరూపం లేనివాడు.

721. అనేకమూర్తిః - అనేకావతారాల రూపాలని ధరించేవాడు.

722. అవ్యక్తః - ఇలాటి రూపమని తెలియవీలు లేనివాడు.

723. శతమూర్తిః - అనేక రూపాలు కలవాడు.

724. **శతాననః** - అనేక ముఖాలు కలవాడు.

725. **ఏకః** - ఎవరూ తనకి లేక తానే అయినవాడు.

726. **నైకః** - మాయ కారణంగా 'అనేకులుగా కన్పించే ఒక్కడు'

727. **సవః** - యజ్ఞమే తన రూపంగా కలవాడు.

728. **కః** - సుఖమే తన రూపమైనవాడు.

729. **కిమ్** - 'ఏది?' అని దేన్ని విచారించి చర్చించినా తెలియబడేవాడు.

730. **యత్** - బ్రహ్మపదార్థాన్ని గురించి ఎలా చర్చించినా తెలియబడేవాడు.

731. **తత్** - పరబ్రహ్మస్వరూపుడు.

732. **పదమనుత్తమమ్** - దేనికి మించిన స్థానం లేదో అలాంటి స్థానమైనవాడు.

733. **లోకబంధుః** - దుఃఖాన్నీ సుఖాన్నీ విన్నవించుకునే చోటైనవాడు.

734. **లోకనాథః** - భూతాలన్నింటినీ శాసించేవాడు.

735. **మాధవః** - మధువనే వాని వంశంలో పుట్టినవాడు.

